# నా జేబులో



డోరిత్ ఎం. సిమ్

అది 1939 నాటి జర్మనీ. చిన్న పిల్లలతో ఉన్న ఒక రైలు బయలుదేరటానికి సిద్ధంగా ఉంది. కుక్క బొమ్మని పట్టుకుని ఒక అమ్మాయి ఉంది. ఆమె అమ్మా, నాన్నలు ఆమెను, “మంచిగా ఉండు. మనం త్వరలో మళ్లీ కలుస్తాం,” అని చెప్పారు. ఆమె స్కాట్‌లాండ్‌లో క్షేమంగా ఉంటుందని చెప్పారు కానీ తమ ఊళ్లోనే చోటు లేకుండా పోయిందని చెప్పలేదు.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో యూదు శరణార్థురాలుగా తన ఆత్మ కథాత్మక అనుభవాన్ని డోరిత్ ఎం. సిమ్ నిజాయితీగా పంచుకున్నారు. ఈ కథని ఆమె కళ్లతో చూసినట్టు జెరాల్డ్ ఫిట్జెరాల్డ్ చక్కగా చిత్రీకరించారు.

పిల్లలను యుద్ధం నుంచి కాపాడటంలో Kindertransport అనే సంస్థ కృషి చేసింది. చాలామంది పిల్లలు తిరిగి తమ కుటుంబాలను కలవలేకపోయారు.



# నా జేబులో




డోరిత్ ఎం. సిమ్





ఆ ఉదయం నావ మీద ఉన్న వాళ్లెవరూ నాస్తా చెయ్యలేదు.

అది 1939వ సంవత్సరం. జులై నెల.

నేను ఒక నావ మీద ఉన్నాను.

యుద్ధం నుంచి తప్పించుకుంటున్న పిల్లలతో ఆ నావ నిండి ఉంది.





హాంబర్గ్ స్టేషన్ నుంచి హాలాండ్‌లోని ఈ నావ దగ్గరకు ఒక రైలు మమ్మల్ని తీసుకుని వచ్చింది.

ఆ రైలులో పిల్లలు ఉన్నారు. వాళ్లకి వీడ్కోలు చెప్పటానికి అమ్మలు, నాన్నలు వచ్చారు.

ఆ రైలు మమ్మల్ని కొత్త జీవితానికి తీసుకుని వెళుతుందని మా ముట్టి (అమ్మ), హాటి (నాన్న) చెప్పారు.

అమ్మలు, నాన్నలు ఏడుస్తున్నారు. మేం కూడా ఏడుస్తున్నాం.





నా చేతిలోంచి కుక్క బొమ్మ జారిపోయింది. అది పట్టాల మీద పడింది. ఒక వ్యక్తి దానిని పైకి తీశాడు. దానిని నా వైపు విసురుతూ, “పట్టుకో!” అంటూ అరిచాడు.

అది నా చేతులలోకి వచ్చిన వెంటనే రైలు బయలుదేరింది.

నేను ఏడ్పు ఆపి అమ్మా, నాన్నలకు వీడ్కోలు పలికాను. కుక్క బొమ్మను గట్టిగా హత్తుకున్నాను.

చాలాసేపు తరవాత రైలు ఒక స్టేషన్‌లో ఆగింది. మేం హాలాండ్‌లో ఉన్నామని ఒక పెద్ద పిల్లవాడు చెప్పాడు. అక్కడ పచ్చని మైదానంలో మేం వెన్నతో బ్రెడ్డు తిన్నాం.

మాకు సహాయం చేసిన డచ్ వాళ్లకు మా పాటలు వినిపించాం. ఒక పాట జలకన్య గురించి.

వాళ్లు మాకు పాలు, చాక్‌లెట్ ఇచ్చారు. మా ప్రయాణం మళ్లీ మొదలయ్యింది.





అమ్మా, నాన్నలు లేకుండా ఓడ మీద పడుకోటం నాకు కొత్తగా ఉంది. తోబుట్టువులు ఉన్నవాళ్లు తప్పించి తెలిసిన వాళ్లెవరూ లేరు. రాత్రిపూట బాత్రూంకి వెళ్లిన కొంతమంది పిల్లలకు మళ్లీ తమ క్యాబిన్ కనుక్కోవటం కష్టం అయ్యింది.





ఓడ గమ్యాన్ని చేరుకుంది. పేర్లు రాసి ఉన్న కాగితాలు మా మెడకి తగిలించుకున్నాం.

ఓడ నుంచి దిగటానికి ఒక కొయ్య పలక వేశారు. పక్కనున్న సముద్రాన్ని చూసిన నాకు కళ్లు తిరగసాగాయి. నడవాలంటే నాకు భయం వేసింది. కానీ, వెనక ఉన్న వాళ్లు నన్ను తోస్తున్నారు. నేను కళ్లు మూసుకుని రేలింగ్ పట్టుకున్నాను.

కళ్లు మూసుకునే నేను ముందుకు నడుస్తున్నాను. చివరికి నా కాళ్లు నేలను తాకాయి. అప్పుడు నాకు ఏడ్పు వచ్చింది.



మా ప్రయాణంలో ముందుకు తీసుకుని వెళ్లటానికి మరొక రైలు సిద్ధంగా ఉంది. అది బ్రిటిష్ రైలు అనీ, మమ్మల్ని లండన్ తీసుకుని వెళుతుందని ఎవరో అన్నారు.

ఆ స్టేషను చాలా రద్దీగా ఉంది. కొంత మంది పిల్లలను కలవటానికి వాళ్ల స్నేహితులు, బంధువులు వచ్చారు. ఇతర పిల్లలు సాయం కోసం చూస్తున్నారు.

కెమేరాలతో కొంతమంది ఉన్నారు.

కొంతమంది చేతులలో ఫొటోలు ఉన్నాయి. ఆ పిల్లలను పెంచే బాధ్యత తీసుకుంటామని వాళ్లు చెప్పారు. తమ తల్లిదండ్రులను తిరిగి కలిసేదాకా ఈ పిల్లలు వాళ్ల దగ్గర పెరుగుతారు.



ఒక దంపతులు ఒక ఫొటోని శ్రద్ధగా గమనిస్తున్నారు.
భర్త చేతిని తాకి భార్య, “తలలో ఎర్ర రిబ్బను, చేతిలో
కుక్క బొమ్మ ఉన్న అమ్మాయి,” అంది.
ఆ ఫొటోతో వాళ్లు నన్ను గుర్తుపట్టారు.

వాళ్లతో ఉన్న వ్యక్తి జర్మన్ మాట్లాడుతున్నాడు. “స్వాగతం,” అని అతను అన్నాడు. ఆ దంపతులు ఇంగ్లీషు మాట్లాడుతున్నారు.

“నా జేబులో రుమాలు ఉంది,” అన్న మాటలే నాకు ఇంగ్లీషులో వచ్చు. ఆ విధంగానే నేను ఇంగ్లీషు నేర్చుకున్నాను.

ఏదైనా కొత్త పదం నేర్చుకున్నప్పుడు దానిని ఇదే వాక్యంలో ఉపయోగించేదానిని.

“నా జేబులో ఒక కుక్క ఉంది.”

“నా జేబులో ఒక ఇల్లు ఉంది.”

“నా జేబులో ఒక టీచరు ఉంది.”







ఆ దంపతులది స్కాట్‌లాండ్. అక్కడ నాకు అంతా కొత్తగా ఉంది. జర్మనీలో నేను మా నాన్న సైకిలుకి ఉన్న చిన్న సీటు మీద కూర్చునే దానిని. ఈ దంపతులు ఉంటున్న ఎడిన్‌బర్గ్‌లో వాళ్లకి కారు ఉంది. ఇప్పుడు నాకు ఒక నిజమైన కుక్క కూడా ఉంది.



నేను యూదుని కావటంతో జర్మనీలో వీధిలో ఇతర పిల్లలతో ఆడుకోనిచ్చేవారు కాదు. ఇప్పుడు నా కొత్త స్కాటిష్ స్నేహితులతో ఆడుకుంటున్నాను.

కొంత కాలానికి ఆ దంపతులను అమ్మా, నాన్నా అని పిలవసాగాను.

ముట్టీ, హాటీ అన్న పేర్లు మాత్రం నా అసలైన అమ్మా, నాన్నలకు ఉంచాను.

ముట్టీ, హాటీల నుంచి నాకు ఒక ఉత్తరం వచ్చింది.
"నువ్వు మాకు ఎప్పుడూ గుర్తుకొస్తావు. మర్యాదగా
ప్రవర్తించటం మరిచిపోకు. ఉత్తరాలు రాస్తూ ఉండు.
ఈ ఉదయం పుట్టగొడుగుల కూర
వండుతున్నప్పుడు నువ్వు గుర్తుకు వచ్చావు.
మనం త్వరలోనే కలుస్తాం అన్న ఆశ నాకు ఉంది."

నేను కూడా అదే ఆశతో ఉన్నాను. ముట్టీ, హాటీల
ఉత్తరాన్ని నేను జాగ్రత్తగా దాచుకున్నాను. ప్రతి
రోజూ దానిని చదివేదాన్ని. యుద్ధం
అయిపోయేవరకు ఆ ఉత్తరాన్ని నా జేబులో భద్రంగా
దాచుకున్నాను.

అయిపోయింది

